# సంఘర్షణల నివారణ కృషి

## ఉభయ పంజాబ్ పోలీసు ఉద్యోగుల సమావేశం

అమృత్‌సర్, ఏప్రిల్ 4: భారత పాకిస్తానుల మధ్య సరిహద్దు సంఘటనలను నివారించే విషయమై ఉభయ పంజాబ్‌ల సరిహద్దు రక్షణ దళాధిపతులు నేడు అత్తారీవాగా దగ్గర సమావేశమైనారు. లాహోర్, అమృత్‌సర్‌ల సీనియర్ పోలీసు సూపరింటెండెంట్లు, సరిహద్దు స్థావరాల అధిపతులూ పరిశీలనాధికారులు, తదితర ప్రముఖులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. ఉభయ సైన్యాలూ సరిహద్దుల్లో సౌమ్య వాతావరణం ఉండవలసిన అవసరాన్ని ఉద్ఘాటించారు.

కిందటి నెలలో జరిగినట్లుగా, ప్రతిదానికీ కాల్పులకు దిగే ధోరణిని వదలుకోవాలని వారు స్థానిక అధికారులకు విజ్ఞప్తి చేశారు. కిందటి నెలలో ఆరుసార్లు సరిహద్దుల్లో నే కాల్పులు జరిగినవి. ఒకరి ప్రాంతంలో మరొకరుచొరబడితే, దానిని తమ ఉన్నతోద్యోగులకు తెలియచేయాలని వారు సూచించారు.

ఈ సమావేశానంతరం ఉభయపక్షాల అధికారులూ కలిసి విందారగించారు. ఏ వివాదాన్ని గురించీ ప్రత్యేకించి చర్చించకపోయినా, సరిహద్దు సంఘటనలను గురించి చర్చించటం జరిగిందని భారత సేనాని తెలియజేశారు.

## సరిహద్దు సమీపంలో రక్షణ కట్టడాల నిర్మూలన

మార్చి 26 సమావేశంలో నిర్ణయం ప్రకారం ప్రస్తుత సరిహద్దులకు 400 గజాల దూరంలోఉన్న రక్షణకట్టడాల నిర్మూలనకు చర్యలు తీసుకోనటము జరుగుతున్నదని భారతసేనాని రాంసింగ్ తెలియజేశారు. కందకాలు పూడ్చటం, రక్షణ కట్టడాలను నిర్మూలించటం మొదలయిన పనులు జరిగేట్లుగా చూసేందుకు ఉభయపక్షాలూ ప్రత్యేకోద్యోగులను ఏర్పాటు చేశారని ఆయన తెలియజేశారు. ఇప్పుడు సరిహద్దుల పొడుగునా అగ్రదళాలు ఎక్కడా లేవని ఆయన తెలియజేశారు.

చెదిరిపోయి సరిహద్దులు దాటి వచ్చే పశువుల్ని తిప్పి పంపించటానికీ, దొంగరవాణాను అరికట్టేందుకు కూడా చర్యలు తీసుకోనటం జరుగుతున్నదని రాంసింగ్ తెలియజేశారు.

కాశ్మీర్ సమస్యపై ఉభయ ప్రధానులు చేసిన ప్రకటనల వల్ల సరిహద్దు వ్యవహారాలేమీ ముదరలేదని ఆయన వెల్లడించారు.



# భోపాల్‌లో భారీ విద్యుద్యంత్ర కర్మాగారం

## నెలకొల్పాలని నిర్ణయం?

భోపాల్, ఏప్రిల్ 5: భోపాల్‌లో భారీ విద్యుచ్ఛక్తి యంత్రాల ఉత్పత్తి కర్మాగారాన్ని నెలకొల్పాలని భారత ప్రభుత్వం నిశ్చయించినట్లు తెలుస్తున్నది. దీనికి 50 కోట్లరూపాయలు ఖర్చవుతుందనీ, ఏ డెనిమిది ఏళ్లలో నిర్మాణం జరుగుతుందనీ, సాంకేతిక సహాయానికి రెండు ప్రముఖ బ్రిటిష్ సంస్థలతో ఒప్పందం కుదిరించనీ తెలియవచ్చింది.

భోపాల్ - దోరాహా రోడ్డుమీద పది చదరపుమైళ్ల ప్రాంతంలో ఫ్యాక్టరీ ఏర్పాటవుతుందనీ, ఇది ఆసియాలో కల్లా పెద్దదిగా ఉంటుందనీ, 50 వేల మంది జనాభాకు వసతి సౌకర్యాలు ఏర్పాటు కాగలవనీ తెలుస్తున్నది.

ఈ ఫ్యాక్టరీలో మొదట పెద్ద పెద్ద ట్రాన్సు ఫార్మర్లు, ఎలక్ట్రిక్ మోటార్లు, స్విచ్ గేర్లూ రెండో పంచవర్ష ప్రణాళికలోపల తయారవుతవట. హైడ్రాలిక్ యంత్రాలు, టర్బయిన్లు, డీసెల్ జనరేటర్లు మొదలైనవి మూడో ప్రణాళికలో తయారవుతవట.

# కాళహస్తి పంచాయతీ ఎన్నిక

## 60 అభ్యర్థి పత్రాలదాఖలు

కాళహస్తి, ఏప్రిల్ 4: పంచాయతీ ఎన్నికలకు, మొన్న 18 వార్డుల నుండి 60 అభ్యర్థి పత్రాలు దాఖలైనవి. 18 వ వార్డులో, ఒకేఒక అభ్యర్థి పత్రం దాఖలవడంచేత అక్కడపోటీ వుండదు. అక్కడ అభ్యర్థి శ్రీ కయ్యూరు రామకృష్ణయ్య (హరిజన్)

ఎన్నికల ఉద్యోగి, డిప్యూటీ పంచాయతీల ఆఫీసరు అయిన శ్రీ జి. మల్లిఖార్జునరావు, యీ అభ్యర్థి పత్రాలు దాఖలుచేసుకున్నారు. మొదటినాలుగు వార్డులలో, ఒక్కొక్క దానికి 8 అభ్యర్థి పత్రాలు దాఖలైనవి.

అభ్యర్థి పత్రాల ఉపసంహారణకు గడువుగ వ తేదీ. చెల్లదగిన అభ్యర్థి పత్రాలప్రకటన ఆక్షేపలు లేనియెడల 7 అభ్యంతరలున్న పక్షంలో 11 వ తేదీ ఎన్నిక 16 వ తేదీన జరుగుతుంది.

## మడకశిర పంచాయతీ ఎన్నికలు

హిందూపురం, ఏప్రిల్ 4: మడకశిర పంచాయతీసంఘం ఎన్నికలు యిా వారతితో పూర్తి అయినవి. శ్రీయుతులు బి. ఎస్. మూర్తి పి. ఎస్. అబ్దుల్ రజాక్ సాబ్ పోటీ లేకుండా ఎన్నికైనారు. పోటీలో, శ్రీయుతులు సత్యనారాయణయ్య, హనుమంతప్ప, నాగప్ప (రి) నంజయ్య, బి. వోలప్ప, పి. సిద్దిప్ప, ఆర్. సిద్దన్న ఎన్నికైనారు.

## మదనపల్లి పంచాయతీ ఎన్నికలు

### 62 మంది పోటీ

మదనపల్లి, ఏప్రిల్ 3: పంచాయతీ ఎన్నికలకు 15 స్థానాలకు 62 మంది అభ్యర్థులు పోటీ చేస్తున్నారు. 11 వ వార్డుకు శ్రీ ఆర్. రెడ్డప్పనాయుడు, పోటీలేకుండా ఎన్నిక అయినారు. మిగతి అన్ని వార్డులలోను పోటీచాలా తీవ్రంగా నున్నది. ఎన్నికలు ఈనెల 16 వ తేదీన జరుగుతవి.

## తెనాలి పురపాలక కార్మికసంఘం

పురపాలకసంస్థ కార్మికసంఘ నూతన కార్యవర్గానికి శ్రీ కొమరగిరి వీరయ్య అధ్యక్షుడు. శ్రీ కోటగిరి వీరయ్య కార్యదర్శి కోశాధికారి, మరో 12 మంది సభ్యులుగా ఎన్నికైనారు. (స్వ. వి.)

## ఏలూరు

రిక్షాకార్మికులు శ్రీ హనుమాన్‌సెట్టి రామారావు అధ్యక్షతన సమావేశమై ఈక్రింది వారితో రిక్షాకార్మిక సంఘం ఏర్పాటుచేసికున్నారు. అధ్యక్షుడు శ్రీ మైనంపాటి శ్రీనివాసరావు, ఉపాధ్యక్షుడు శ్రీ మరిశాపోతురాజు, కార్యదర్శి శ్రీ చేరా గంగయ్య, సంయుక్త కార్యదర్శి శ్రీ పెంటకోట వెంకునాయుడు-కోశాధికారి: శ్రీ కంబ రెడ్డి పారుపల్లి. (స్వ. వి.)

## త్వరలో చైనాలో పాక్ ప్రధాని పర్యటన

కరాచీ, ఏప్రిల్ 4: రెండు వారాలపాటు చైనాలో పర్యటించేందుకు పాకిస్తాన్ ప్రధాని చౌదరి మహమ్మద్ అలీ మేనెల 14 తేదీన కానీ 15 తేదీన కానీ బయలుదేరుతున్నారని అధికారరీత్యా ప్రకటన జరిగింది. విదేశాంగ మంత్రి హమీదుల్ హక్ చౌదరీ, విదేశాంగ కార్యదర్శి ఎం. ఎస్. ఎ. బేగ్ ప్రభృతులు ప్రధానివెంట చైనా వెడతారు.

పాక్ ప్రధాని చైనాలో అనేక ప్రముఖ నగరాలను సందర్శిస్తారు.

ఇంతవరకూ కాబూల్‌లో పాక్ రాయబారిగా ఉన్న కర్నల్ ఎ. ఎస్. బి. షాను మాస్కోలో పాకిస్తాన్ రాయబారిగా నియమించే అవకాశం ఉన్నట్లు నేడు కరాచీలో ప్రభుత్వ ప్రతినిధి విలేఖరుల గోష్ఠిలో సూచించారు.

# రాజమండ్రి సేవా సమాజం కృషి

## ప్రపంచ క్రైస్తవ పీఠశాఖాధికారి ప్రశంస

రాజమండ్రి, ఏప్రిల్ 3: ప్రపంచ క్రైస్తవ పీఠాల (చర్చి వరల్డు సర్వీసు-న్యూయార్కు) నిర్వాహణ శాఖా కార్యదర్శి-శ్రీ కస్పర్, అమెరికావాస్తవ్యుడు రెవరెండ్ కుంజ్, మదరాసులో వుండే క్రైస్తవ ప్రచారకులు శ్రీ జె. స్టీఫెన్ రాజమహేంద్రవరంలోని లూథరన్ మిషన్ అధ్యక్షుడు శ్రీ విలియం కోల్మన్‌తో కలసి, రాజమండ్రి సేవా సమాజశాఖ (గిల్డ్ ఆఫ్ సర్వీస్) నడుపుతూవున్న సేవాకేంద్రాన్ని సందర్శించారు.

శ్రీమతి లక్ష్మి వారికి స్వాగతమిస్తూ గోదావరి వరదరోజులలో క్రైస్తవ మిషను ఎంతో ఉదారంగా సహాయం చేసింది వివరించి అందుకు కృతజ్ఞత తెలిపారు.

శ్రీ కుంజ్ ప్రసంగిస్తూ తామిచ్చిన సహాయం ఈ సేవాసమాజం సక్రమంగా వినియోగించినందుకు సంతోషిస్తున్నామనీ, ఈ బహుమతులను అమెరికా నుంచి పంపేది పెద్దవాళ్ళేగాక పిల్లలు కూడా తమద్వారా అందజేస్తూ వుంటారనీ చెప్పారు.

శ్రీ కస్పర్ మాట్లాడుతూ ప్రపంచ ప్రజలంతా ఏ మతస్థులయినా దేవుని బిడ్డలేనన్న విషయం గుర్తుంచుకోవాలన్నారు. ఆహారపదార్థమంతా దేవుని ఆస్తి కనుక దేవుని బిడ్డలయిన మనమంతా ఆ పవిత్రార్జితాన్ని అన్యోన్య సహకారంతో అనుభవించాలని అన్నారు. శ్రీ కుంజ్, శ్రీ కస్పర్ జపాన్, హాంగ్‌కాంగ్, కొరియా, ఫార్మోజా, దక్షిణభారతములలో పర్యటించారనీ — తెలుగుదేశంలో పెద్దాపురం-గుంటూరు - తిరుపతి - చిత్తూరు చూడాలనుకుంటున్నారనీ శ్రీ విలియం కోల్మన్ తెలియజేశారు.

ఈ అతిథులక్కడ వుండగా రోజూ పాలకోసం ఈ సేవాకేంద్రానికి వచ్చే బీదప్రజలు మామూలు వేళకు వచ్చారు. శ్రీ కస్పర్ వారికి పాలను పంచిపెట్టారు.

శ్రీ సదాశివయ్య (రాజమండ్రి సేవాసమాజశాఖ అధ్యక్షులు) ఈ అతిథుల రాకకు గర్విస్తున్నామని అన్నారు. శ్రీమతి లక్ష్మీసుబ్బారావు వందనాలు సమర్పించారు. (స్వ. వి.)

## కళ్యాణదుర్గం హిందీ ప్రేమీమండలి

కళ్యాణదుర్గం, ఏప్రిల్ 2: ఈపట్టణ హిందీ ప్రేమీమండలి సర్వసభ్య సమావేశం నిన్న యీ ప్రాంతపు పాఠశాలల డిప్యూటీ ఇన్స్పెక్టరు శ్రీ ఆ. కృష్ణప్ప అధ్యక్షతన జరిగింది. శ్రీయుతులు జి. రామశర్మ, ఆ. విరూపాక్షప్ప, ఆ. అయ్యణ్ణ, జి. వెంకటనారప్ప, ప్రేమీమండలి విద్యార్థుల సంఖ్య అధికం చేయాలని, ప్రాథమిక, మాధ్యమిక, రాష్ట్రభాష పరీక్షలలో సర్వప్రథమ ద్వితీయ స్థానములలో ఉత్తీర్ణులైనవారికి బహుమతులు యేర్పాటు చేయాలని సూచించారు.

అధ్యక్షులు, ప్రాథమిక, మాధ్యమిక రాష్ట్రభాషలలో ఉత్తీర్ణులైనవారికి యోగ్యతాపత్రాలు యిచ్చారు.

తరువాత మండలి కార్యవర్గానికి శ్రీ జి. రామశర్మ అధ్యక్షులుగా, ఆ. అయ్యణ్ణ కార్యదర్శిగా, జి. అడెప్ప శ్రేష్ఠి కోశాధికారిగా, ఆ. విరూపాక్షప్ప, జి. వెంకటనారప్ప, జి. కోదండరాములు, యం. రామచంద్రయ్యశ్రేష్ఠి సభ్యులుగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

## విజయవాడ హిందీ ప్రేమీ మండలి వార్షికోత్సవం

విజయవాడ, ఏప్రిల్ 4: పట్టణ హిందీప్రేమీమండలి వార్షికోత్సవం యీనెల 19న జరుపుటకు హైదరాబాదు వ్యవసాయశాఖ మంత్రి డా॥ చెన్నారెడ్డిని ప్రారంభకులుగాను శ్రీ మోటూరి సత్యనారాయణను అధ్యక్షులుగా, ఆహ్వానించటానికి ప్రేమీమండలి కార్యవర్గం నిశ్చయించుకొన్నది.

## పెదపూడిలో మహిళా హిందీసదన్

తెనాలి, మార్చి 31: పెదపూడి గ్రామంలో నిన్న సాయంకాలం గ్రామ మహిళాసంఘ యాజమాన్యాన యేర్పాటుచెసిన హిందీసదన్‌కు మహిళాసభ గౌరవ కార్యదర్శిని భారత సేవక్ సమాజ స్త్రీశాఖ కార్యకర్త శ్రీమతి సి. వి. లక్ష్మిరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. సభకు శ్రీమతి కొల్లి బసవపున్నమ్మ అధ్యక్షత వహించారు. శ్రీమతి బోయపాటి సుభద్రాదేవి హిందీ భాషావశ్యకతను గురించి మాట్లాడారు. గ్రామంలోని మహిళలందరు సమావేశంలో పాల్గొన్నారు. కార్యదర్శి శ్రీమతి శరణుకమలాదేవి వందన లర్పించారు.

# ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపు

## బెజవాడలో విద్యుచ్ఛక్తి రేట్లవృద్ధి

విజయవాడ, ఏప్రిల్ 1: పురపాలక సంఘం ఆధీనంలోని ఉన్నత పాఠశాలలో మొదటి ఫారంనుంచి మూడవఫారం వరకు విద్యార్థుల జుసుం నెలకు 4 అణాలు, 4 వ ఫారంనుంచి నెలకు 8 అణాలు విద్యార్థులవద్ద జుసుం వసూలు చేయాలని, ప్రాథమికోపాధ్యాయులందరికి ప్రభుత్వమిచ్చే జీతనాలను ఇవ్వాలని 1956-57 బడ్జెటు పరిశీలనకు నియమించిన సంఘం గత నెల 30, 31 తేదీలలో నిర్ణయించారు. సర్వాధికారాలతో నియమించిన ఈ సంఘం డాక్టరు జె. దక్షిణామూర్తి అధ్యక్షతన కిందటి నెల 30, 31 తేదీలలో సమావేశమై 1956-57 వ సంవత్సరం పురపాలకసంఘం బడ్జెట్‌ను ఆమోదించారు.

ఆస్తిపన్నును నూటికి రు 24 నుంచి రు 30 వరకు ఎక్కువచెయ్యాలని కమీషనరుచేసిన సూచనను ఈ సంఘం తోసివేశారు.

విద్యుచ్ఛక్తి యూనిటీధరను 4 అణాలనుంచి రు 0-4-6 కు పెంచారు. అయితే సినిమా ప్రదర్శన శాలలకు, వ్యాపారసంస్థలకు, వ్యవసాయసంస్థలకు సప్లయిచేసే విద్యుచ్ఛక్తి ప్రభుత్వధర నే వసూలు చెయ్యాలని నిర్ణయించారు.

తరతమ భేదాలేమీ లేకుండా పాకీ పనివారందరికి నెలజీతం రు. 15 ఇవ్వాలని నిర్ణయించారు.

రెండవ పంచవర్ష ప్రణాళిక అభివృద్ధిపనులకు రు. 25 లక్షలు కేటాయించారు. కృష్ణలంక నీటిసప్లయి పథకం, భూగర్భ మురుగునీటి కాలవల నిర్మాణ పథకం, పురపాలకసంఘ కార్యాలయ భవననిర్మాణ పథకం, పాఠశాలలకు సొంతభవనాలు కట్టించే పథకం మొదలైనవాటిని ఈ సొమ్ముతో జరిపించే అభివృద్ధిపనులలో చేర్చారు.

## చీరాల పార్కులో విద్యుద్దీపాలంకరణ

చీరాల, ఏప్రిల్ 2: పురపాలక గ్రంథాలయంవద్ద నున్న పార్కులో విద్యుత్ దీపాలంకరణ కొరకు రు 600 మంజూరుచేస్తూ, పురపాలక సంఘం మార్చి 26 న తీర్మానించారు. పేరాలలోని ఆంధ్రరత్న పురపాలక సంఘ ఉన్నత పాఠశాల భవన నిర్మాణము కొరకు పగము సొమ్ము భరించమని వి. యల్. టి. డి. కంపెనీని అభ్యర్థిస్తూ యింకో తీర్మానం చేశారు.

## తెనాలిహైస్కూలు వార్షికోత్సవం

తెనాలి, ఏప్రిల్ 2: పురపాలకబాలికోన్నత పాఠశాల అరవ వార్షికోత్సవం మార్చి 28 న ప్రిన్సిపల్ సబార్డినేట్ జడ్జి శ్రీ బి. ఆర్. బలపతిరావు అధ్యక్షతన జరిగింది. ఉదయం పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి కమీషనర్ శ్రీపి. నాగభూషణంనాయుడు యాజమాన్యాన విద్యార్థుల వ్యాయామ ప్రదర్శనాలు జరిగినవి. శ్రీ స్థానం నరసింహారావు విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు. ప్రధానోపాధ్యాయులు శ్రీ వల్లూరి హనుమంతరావు వార్షిక నివేదికను చదివారు. విద్యార్థులు గుమాస్తా అనే నాటికను, ఉపాధ్యాయులు ప్రతాపరుద్రీయం నాటకము ప్రదర్శించారు. స్వ. వి.

## బారువ హైస్కూలు వార్షికోత్సవం

బారువ, ఏప్రిల్ 3: బోర్డు ఉన్నత పాఠశాల ప్రథమ వార్షికోత్సవం గత నెల 31 న జరిగింది. శ్రీ కె. సూర్యనారాయణ నివేదిక చదివారు. శ్రీ డబ్ల్యు. రామమూర్తి అధ్యక్షత వహించారు. మంత్రి శ్రీ లచ్చన్న శుభ సందేశం పంపారు.

బాలబాలికలు హిందీ, తెలుగు, ఒరియా గీతాలు పాడారు. నృత్య నాటక వినోద ప్రదర్శనాలు జరిగాయి.

## జంపడ్వార్ ఆంధ్ర సంస్కృతీ సప్తాహం

జంషెడ్పూరం, ఏప్రిల్ 4: ఈ నెల 12 వ తేదీ లగాయతూ, వారం రోజులపాటు, సాహిత్య, సంగీత సభలు, నాటక నాటికా ప్రదర్శనలు ఆంధ్ర నాటక సంఘమువారి అధ్యక్షతన యిక్కడ జరపాలని నిశ్చయమైనది.

సాహిత్య సభలకు అధ్యక్షులుగా శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి ని, నాటక సమావేశాలకు అధ్యక్షులుగా శ్రీ బందా కనకలింగేశ్వరరావును ఆహ్వానించవలిచారు.

## గుంటూరులో రామతారక నామోత్సవం

గుంటూరు, ఏప్రిల్ 1: గుంటూరు బ్రాహ్మణగర్‌లో ఉన్న శ్రీ రామ పూజామందిరంలో మార్చి 22 నుంచి 27 వ తేదీవరకు శ్రీరామ తారకనామ సప్తాహ మహోత్సవాలు జరిగినవి. ప్రతిరోజూ నగరసంకీర్తనం, హరికథలు, పాటకచ్చేరీలు, పురాణ కాలక్షేపాలు, అన్నదానం జరిగినవి. పూజామందిర సభ్యుల, పౌరుల సహకారంలో మందిర నిర్వాహకుడు శ్రీ గుడిపాటి వెంకట సుబ్రహ్మణ్యంగారు కార్యక్రమాన్ని వైభవంగా నిర్వహించారు.

# క్రీడారంగం

## ప్రపంచ టేబుల్ టెన్నిస్

### జపాన్, రుమేనియాల గెలుపు

టోక్యో, ఏప్రిల్ 5: ఇక్కడ జరుగుతున్న ప్రపంచ టేబుల్ టెన్నిస్ టీమ్ చాంపియన్‌షిప్ పోటీలలో జపాన్ పురుషుల టీమ్ చాంపియన్ షిప్పునూ (స్వేత్లింగ్ కప్), రుమేనియా స్త్రీల చాంపియన్‌షిప్పునూ (కార్బిలాన్‌కప్) నిలబెట్టుకున్నవి.

స్వేత్లింగ్ కప్ ఫైనల్సులో జపాన్ జెకోస్లవేకియాను ఓడించింది (5-1) జెకోస్లవేకియా కిందటి సం॥ కూడా ఫైనల్సులో నే ఓడిపోయింది ఈ తడవ ఈ రెండు దేశాలూ గ్రూప్ పోటీలలో తాము ఆడిన వీను పోటీలలోనూ గెలిచినవి.

కార్బిలాన్‌కప్ ఫైనల్సులో ప్రస్తుత చాంపియన్ రుమేనియా జపాన్‌ని ఓడించింది (3-1).

ఈ పరి స్వేత్లింగ్‌కప్ పోటీలలో ఇండియా పోర్చుగల్‌ని ఓడించింది (5-3).

స్వేత్లింగ్ పోటీలలో అన్ని దేశాలూ ఏడేసి పోటీలలో పాల్గొన్నవి. ఈ ఆటలో ప్రముఖదేశాలూ కొన్ని గెలిచిన పోటీలు ఈ విధంగా ఉన్నవి: జపాన్ 7, జెకోస్లవేకియా 7, ఇండియా 3, రుమేనియా 6, ఇంగ్లండ్, చైనా, జర్మనీ, వియత్నాంలు తలా 5, పోర్చుగల్ ఒక్కటీ లేదు.

కార్బిలాన్‌కప్ పోటీలలో ఒక్కొక్క పోటీలలో పాల్గొన్నది. రుమేనియా 7, జపాన్ 6, ఇంగ్లండ్ 6, పోటీలలో గెలవగా, ఇండియా ఒకదాంట్లోనూ గెలవలేదు.

#### స్వేత్లింగ్ కప్

స్వేత్లింగ్ కప్ పోటీలలోనిన్న ఇండియా దక్షిణ కొరియాను ఓడించింది (5-2). ధాకర్సీ కిం దూ యాన్ నీ (21-19, 17-21, 21-17), ధాకర్సీ కించిందూనీ (20.22, 21-18, 21-14), వ్యాస్ జోన్ యాన్ సక్ నీ (21-18, 7-21, 25-23). వ్యాస్ కిం దూ యాన్ నీ (21-17, 21-19), వ్యాస్ కించిందూనీ (21-15, 21-19) ఓడించారు. నాగరాజ్ కిచిందూ చేతనూ (19-21, 21-12, 11,21 చోన్ యాన్‌సక్ చేతనూ (15-21, 17-21) ఓడించబడ్డారు.

ఇండియా అమెరికాను ఓడించింది. (5-4). ధాకర్సీ మిర్స్ కోవిట్స్ నీ (21-13, 21-13) గుస్తికాఫ్ నీ (21-17, 21-17) ఓడించాడు. నాగరాజ్ గుస్తికాఫ్‌నీ (21-16, 21-19), మిర్స్ కోవిట్స్‌నీ (21-17, 18-21, 21-17) ఓడించాడు. యులీన్‌వ్యాస్ గుస్తికాఫ్‌ని ఓడించాడు (21-13, 21-12). బుకీట్ వ్యాస్‌నీ (21-14, 16-21, 21-14), నాగరాజ్‌నీ (21-15, 21-18), ధాకర్సీని (21-13, 21-14) ఓడించాడు. మిర్స్ కోవిట్స్ వ్యాస్‌ని ఓడించాడు (21-19, 23-21).

కార్బిలాన్‌కప్ (స్త్రీల చాంపియన్ షిప్) పోటీలలో హాంకాంగ్ ఇండియాను ఓడించింది (3-2). రాచెల్ జాన్ బాగ్యియాఆవాంగ్ నీ (21-6, 21-16), చాన్ యీ చింగ్ నీ (21-19, 21-19) ఓడించింది. మీనా పరంజపే బాగ్యియాఆవాంగ్ చేతిలోనూ (16-21 20-22), చాన్‌యీచింగ్ చేతిలోనూ (21-16, 16-21, 18-21) ఓడిపోయింది. రాచెల్ జాన్, మీనా పరంజపేలను వాంగ్, యీచింగ్‌లు ఓడించారు (21-16, 18-21, 18-21),

ఇంగ్లండ్ ఇండియాను ఓడించింది (3-0). ఆన్ హేడెన్ మీనాపరంజపేని (21-8, 21-19), డయానారోరాచెల్ జాన్‌నీ (21-18, 22-24, 21-16), రోహేడన్‌లు పరంజపే, జాన్‌లనూ (21-18, 21-14) ఓడించారు.

అమెరికా ఇండియాను ఓడించింది (3-2). రాచెల్ జాన్ జాయ్‌బెర్గర్ నీ కొలపరిమితి మీదా (3-21, 21-15, 19-15), పరంజపే ష్లాంనీ (19-21, 21-16, 21-18), ఓడించిచారు. ష్లాం రాచెల్ జాన్‌నీ (15-21, 21-11, 21-16), జాయ్‌బెర్గర్ పరంజపేనీ (23-21, 21-14), జాయ్‌బెర్గర్, ష్లాంలు పరంజపే జాన్‌లనీ (21-10, 21-14) ఓడించారు.

## హైదరాబాద్ బాడ్మింటన్

హైదరాబాద్, ఏప్రిల్ 4: ఇక్కడ వై. ఎం. సి. ఎ. లో జరుగుతున్న హైదరాబాద్ రాష్ట్ర బాల్ బాడ్మింటన్ చాంపియన్ షిప్ పోటీలలో సీనియర్ సింగిల్స్ సెమిఫైనల్సులో మజీద్ అఫ్సర్‌నీ (29-27, 21-29, 29-18), మహమూద్ సూర్యనారాయణనూ (29-12, 29-9) ఓడించారు.

జూనియర్ డబుల్స్ ఫైనల్సులోని పాల్ సింగ్, ఎ. హమీద్‌లు అబ్దుల్ ఖాదర్, ఖలీక్‌లను ఓడించారు (20-25, 29-21)

## కాకినాడలో సారస్వత సంఘ ఆటలు

కాకినాడ, ఏప్రిల్ 4: కాకినాడ సారస్వత సంఘ 79 వార్షికోత్సవం ఏప్రిలు 1 న శ్రీ పైండా వెంకటనారాయణ అధ్యక్షతన జరిగింది. శ్రీ ఎం.వి. వి. కె. రంగాచారి ప్రార్థనచేశారు. శ్రీ ఇ. వి. ఆర్. సుబ్బారావు సంఘం గురించి ప్రసంగించారు. శ్రీ దంటు భాస్కరరావు ఓడియర్దునకు నూతన భవన నిర్మాణం అవసరమన్నారు. ఆటలలో గెలుపొందినవారికి అధ్యక్షులు బహుమతులిచ్చారు.

టెన్నిస్ సీనియర్ సింగిల్సు మొదటి బహుమానము-కె. వీరశలింగం, 2. పి. రమణారావు.

సీనియర్ డబుల్సు మొదటి బహుమానము పి. రమణారావు, కె. ఎస్. రాజాగార్లు 2. కె. వీరశలింగం, పి. సుబ్రహ్మణ్యం.

జూనియర్ సింగిల్సు 1. లంక వెంకటేశ్వరరావు, 2. వి. సూర్యనారాయణమూర్తి.

జూనియర్ డబుల్సు 1. సి. వి. రమణారావు, ఎస్. ఎస్. కాళేగార్లు 2. ఆర్. కృష్ణమూర్తి, సి. అన్నాజీరావు.

కాంట్రాక్ట్ బ్రిడ్జ్ 1. కోకా సత్యనారాయణ, కె. బాపిరాజుగార్లు. 2. పి. ఆచారి, చల్లా సీతారామయ్య గార్లు.

ప్రోగ్రెసివ్ బ్రిడ్జ్ 1. ఉత్తర, దక్షిణాలు డబ్ల్యు. ఎస్. మూర్తి, పి. స్వామిగార్లు. 2. తూర్పు, పడమరలు ఎల్. వెంకటేశ్వరరావు, ఎస్. ఎల్. నారాయణరావుగార్లు.

బిలియార్డ్సు 1. కె. రామకృష్ణరావు, 2. డా॥ డి. బలపతిరావు.

స్నూకర్ 1. కె. రామకృష్ణారావు, 2. పి. భాస్కరరావు.

టేబిల్ టెన్నిస్ సింగిల్సు 1. కె. వీరశలింగం, 2. కె. వి. రమణ. డబుల్సు 1. ఇ. సత్యం, లక్కరాజు వెంకటేశ్వరరావుగారు, 2. సి. సీతారామయ్య, డా॥ కె. నరసింహారావు గార్లు.

చతురంగం (ఇంటర్నేషనల్)
1. పొరుపూడి రామమోహనరావు, (విన్నర్) 2. వంక కృష్ణమూర్తి. (రన్నరప్)

ప్లో సైకిల్ 1. వి. హనుమంతరావు, 2. సి. సుదర్శనరావు, 3. వై. ఆర్. దొర.

బాస్కెట్ బాల్ షూటింగ్ 1. జె. ఆర్. రావు, 2. ఇ. సత్యం.

క్రికెట్ బాల్ త్రో 1. పి. రమణారావు, 2. వి. హెచ్. రావు, 3. ఇ. సత్యం.

# "రుద్రమదేవి" కృతి సమర్పణం

## శ్రీ మంచికంటి వెంకటేశ్వరరావు రచన

నరసారావుపేట, ఏప్రిల్ 2: విక్టోరియా నాటకశాలలో మొన్న శ్రీ కోన వేంకటరాయశర్మ అధ్యక్షతన సంతగుడిపాడు వాస్తవ్యులు శ్రీ మంచికంటి వెంకటేశ్వరరావు తాము రచించిన "రుద్రమదేవి" కావ్యాన్ని శ్రీ నడింపల్లి రామకృష్ణరావు పంతులుకు కృతి ఇచ్చారు. శ్రీ లంకా-సీతారామశాస్త్రి విద్వాన్ భాగవతుల వేంకటసుబ్బారావు, శ్రీ పి. వి. రమణారెడ్డి, శ్రీ నడింపల్లి వెంకట హనుమంతరావుపంతులు శ్రీ వెల్లంకి లక్ష్మణావధాని శ్రీ కంభంపాటి బాలకృష్ణకవి, శతావధాని కస్తూరి కంటి వీరభద్రాచార్యులు, శ్రీ ఇల్లెందుల రంగనాయకులు గుప్త, విద్వాన్ గుడిపూడి పూర్ణచంద్రరావు, శ్రీ ధర్మపురి శేషగిరిశర్మ మొదలైనవారు ప్రసంగించారు. శ్రీ రామకృష్ణరావు, శ్రీ వెంకటేశ్వరరావుకు నూతన వస్త్రాలు, నూటపదారు రూపాయలు ఇచ్చి సత్కరించారు. కవి వ్రాసిన యితర కావ్యములలోని కొన్ని పద్యాలను శ్రీ పొలూరి లక్ష్మీకాంతారావు, శ్రీ పోశెట్టి లక్ష్మీకాంతారావు గానం చేశారు. శ్రీ గురుమూర్తి రాజా గేయా లాలాపించారు. శ్రీ కొత్తూరు వెంకటేశ్వర్లు గుప్త, శ్రీ వల్లభూడి సీతారామయ్య చౌదరి వందనసమర్పణ చేశారు.

మరునాటి రాత్రి "వీర జ్యోతి" నాటకం ప్రదర్శించి, కవికి రు 550 ఇచ్చి సత్కరించారు. (స్వ. వి)

# హోటలు పనివానిపై హింస

## యజమాని అరెస్టు

నిడుబ్రోలు, ఏప్రిల్ 3: ఇక్కడ ఒక కాఫీహోటలు పనివాణ్ణి, అక్రమంగా నిర్బంధించి, తాళ్ళతోకట్టి, హింసపెట్టిన నేరంలో, నలుగురు నేరస్థుల కోసం, పోలీసులు, మూడురోజులుగా వెతికి చివరకు, హోటలు యజమానిని సోమవారం రాత్రి అరెస్టుచేశారు. అతనిని సబ్ మేజిస్ట్రేటు యెదుట హాజరుపరచగా, ముగ్గురివద్దనుండి తలా వెయ్యిరూపాయల జామీనుపై, వదలి వేశారు.

ఈ విషయమై విచారించగా, మార్చి 30వ తేదీన రామకృష్ణ అనే ఆ హోటలు పనివానిని, నలుగురు తాళ్ళతోకట్టి కొట్టారని, అతని వంటినిండా గాయాలైనవని తెలిసింది.

ఇంకా పోలీసు దర్యాప్తు చేస్తున్నారు.

## తెనాలి గౌరిశంకర నాట్యమండలి

తెనాలి, మార్చి 31: శ్రీ వెంకటగారి శంకర నాట్య మండలి సాధారణ సమావేశం శ్రీ కోట వెంకట సుబ్రహ్మణ్యం అధ్యక్షతన జరిగింది. నూతన సంవత్సరానికి యీ దిగువవారిని కార్యవర్గ సభ్యులుగా ఎన్నికొన్నారు. అధ్యక్షుడు: శ్రీ పి. యస్. ఆర్. శాస్త్రి, కార్యదర్శి: శ్రీ తామనులూరు శ్రీరామమూర్తి, కోశాధికారి శ్రీ వి. యస్. డి. అవధాని, కన్వీనరు: శ్రీ వంగవేటి యజ్ఞనారాయణశర్మ.

# ఆకాశవాణి

ఆదివారం, ఏప్రిల్ 8

విజయవాడ

ఉ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7 తెలుగు వా 7-15 మదరాసు (బి) వలె 7-30 (ఎ) వలె 8 ఆంగ్ల వా 8-15 వాద్య సంగీతం 8-30 సంస్కృతసుధ కార్యక్రమం 10 అ॥ భా॥ సంగీత కార్యక్రమం (ఢిల్లీ) శాస్త్రీయ సంగీతం ఎం. ఎస్. సుబ్బులక్ష్మి

మ 1 మదరాసు వలె 1-30 (ఎ) వలె 1-40 హిందీ వా 1-50 తెలుగు వా 2 (బి) వలె 2-15 ఆట విడుపు మదరాసునుండి (రిలే)

సా 5-30 ఎస్. పి. ఆర్. విఠల్ రావు 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా 6-15 గ్రామ కార్యక్రమం 7. తెలుగు వా 7-15 వీథినాటకం 7-30 గీతావళి జోస్యుల సీతారామశాస్త్రి 7-45 ఉభయకుశలోపరి 8 ఎస్. పి. ఆర్. విఠల్ రావు 8-30 ప్రస్తుత విశేషము (ఆంగ్ల ప్రసంగం) ఢిల్లీ నుండి రిలే 8-45 వాద్యసంగీతం (రి) 9 ఆంగ్ల వా 9-15 గీతావళి జోస్యుల శ్రీరామశాస్త్రి 9-30 రసమయి స్వగతములు (ప్రసంగం) రచన: భాగవతుల ఉమామహేశ్వరరావు 9-45 కల్పలత (రి) 10 ప్రసార సమాప్తి.

మద్రాసు ఎ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్య సమ్మేళనం 7-15 తమిళ వా. 7-30 ఉదయగానము 8-15 ఎస్. కృష్ణమూర్తి.

మ॥ 1 ఎ. ఐ. ఆర్. వాద్యగోష్ఠి 1-30 (రి) 1-40 హిందీవా. 1-50 (రి) 2 తమిళవా. 2-10 (రి) 2-30 దేవారమ్ 3 ఎం. కల్యాణం. చిత్తూర్ గోపాల కృష్ణన్-వయొలిన్ తంజావూర్ నారాయణస్వామిపిళ్లై-మృదంగం.

సా॥ 5 పాశ్చాత్యసంగీతం (రి) 5 30 పి. ఎస్. రాజరత్నం 6-5 ప్రాంతీయ వా. 6-15 శ్యామలాస్వామి-వీణ 6-45 కమలా అనంతకృష్ణన్ 7-15 తమిళవా. 7-30 సంధ్యాగానం (రి) 7-45 తిరుచి వలె 8-30 ఎస్. చెంగల్వరాయన్-వయొలిన్ 9 మహారాజపురం సంతానం-త్యాగయ్యపదాలు 9-45 పాశ్చాత్య సంగీతం (రి) 10-30 ప్రసార సమాప్తి.

మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7-15 ఉదయగానం 7-30 సావాసుల్ (రి) 8 ఆంగ్ల వా 8-15 మలయాళ రూపకం 8-30 ఆనందలహరి (శంకరాచార్య) సంస్కృతమున కార్యక్రమం 8-45 కన్నడ నాటిక.

10 అ॥ భా॥ సంగీత కార్యక్రమం ఎం. ఎస్. సుబ్బులక్ష్మి-ఢిల్లీ

మ॥ 1 ఎవలె 1-30 ఆంగ్ల వా 1-40 (రి) 1-50 తెలుగువా 2 తెలుగు 2-15 ఆట విడుపు 3 ఎవలె.

సా॥ 5-30 ఎవలె 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆంగ్ల వా 6-5 ప్రాంతీయ వా 6-15 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగు వా 7-15 వీథినాటకం 7-30 శ్రోతల పరిచయం 7-45 ఎవలె 8 30 ఢిల్లీవలె 9 ఆంగ్ల వా 9-15 వికల్ప రాజ్యసమితి కార్యక్రమం 9-30 రసమయి (విజయవాడ) 9-45 (రి) 10-30 ప్రసార సమాప్తి.

హైదరాబాద్

ఉ॥ 6-50 సుప్రభాత్ 6 55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా. 7-15 కర్ణాటక సంగీతపాఠం 7-30 హిందుస్థానీ సంగీతపాఠం 7-45 కన్నడ వా 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8 30 అవో బచ్చో 9-15 బాలవినోదం నిర్వహణ, వి. ఎస్. రమాదేవి 10 అ॥ భా॥ సంగీత కార్యక్రమం 11-30 నేటి వినోదకార్యక్రమం.

మ॥ 12-30 (రి) 12-50 మరాఠీ వా. 1 ఖయాల్ 1-30 ఆర్. బాలసరస్వతి (రి) 1-50 తెలుగు వా.

సా॥ 5-30 ఖయాల్ 5-45 భజన్ 6 మరాఠీలో కార్యక్రమం 6-30 నాట్యగీతే (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గీతావళి జి. ఇందిరానాయుడు 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ బుర్రకథ బూర్గుల రామమూర్తి బృందం 7-45 ఘజల్ 8 ప్రసంగం 8-15 వాద్యత్రయి వీణ వయొలిన్, వేణువు 8-30 ఢిల్లీవలె 8-45 కె. ఆర్. కల్లంచక్రవర్తి 9 ఆంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 రసమయి 9.45 కె. ఆర్. కల్లంచక్రవర్తి 11-30 ప్రసారసమాప్తి.

## అన్నమాచార్య దినోత్సవాలు

తిరుపతిలో అన్నమాచార్య దినోత్సవ సందర్భంలో ఆకాశవాణి బృందం రికార్డుచేసిన సంగీత కార్యక్రమాలను విజయవాడ కేంద్రంనుండి ఈ నెల 9 వ తేదీరాత్రి 10 నుండి 10-30 వరకు 10 వ తేదీ రాత్రి 9-30 నుండి 10 గం బలవరకు, 11 వ తేదీ రాత్రి 10 నుండి 10-30 వరకూ ప్రసారం చేస్తారు.

## పరివర్తన నాటకం

మదరాసు, ఏప్రిల్ 6: మదరాసు లిటిల్ థియేటర్సువారు ఈనెల 8 వ తేదీ ఆదివారం సాయంత్రం 6-30 కు సౌంధ్యమహాలులో ఆచార్య ఆత్రేయ వ్రాసిన 'పరివర్తన' నాటకాన్ని ప్రదర్శిస్తారు. నటీనటులు శ్రీ సి. నాగభూషణం, శ్రీ టి. రమణారెడ్డి, శ్రీమతి టి. జి. కమలాదేవి మొదలగువారు పాల్గొంటారు.

# రష్యాలో మూలసూత్రాలు మారినట్లు లేదు

## స్టాలిన్‌పై విమర్శలవలన లాభం ఏమిటని ఐసెన్‌హోవర్ ప్రశ్న

వాషింగ్టన్, ఏప్రిల్ 4: సోవియట్ యూనియన్‌లో స్టాలిన్‌ని విమర్శించటం జరుగుతున్నప్పటికీ, కమ్యూనిస్టు మూలసూత్రాల్లో మార్పు వచ్చినట్లు అది సూచించదని అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్ విలేఖరుల గోష్ఠిలో వ్యాఖ్యానించారు. ఇంకా సోవియట్ అనుసరిస్తున్న శ్రామికవర్గ నియంతృత్వవాదం, ప్రపంచాధిపత్యంకోసం చేస్తున్న ప్రయత్నాల మాట ఏమిటని ఆయన ప్రశ్నించారు.

అంతరంగికంగానూ, బాహ్యంగానూ వస్తున్న ఒత్తిడివల్ల సోవియట్ నాయకుల విధానాలు కొంత ఉదారం అయి వుండవచ్చునని విదేశాంగ మంత్రి శ్రీ డలెస్ చేసిన వ్యాఖ్యానంతో ఏకీభవిస్తారా అని అడగ్గా, ఏకీభవిస్తానని ...

### ఆయుధాల తగ్గింపు

### పశ్చిమాసియా పరిస్థితి

## ఆంగ్లో-సోవియట్ మైత్రి

### శ్రీ మాలెంకోవ్ ప్రచారం

లండన్, ఏప్రిల్ 4: సోవియట్ ...

## భారీ పరిశ్రమలు

### కేంద్రప్రభుత్వమే నెలకొల్పాలని నిర్ణయం

### పర్వతారోహణకు బయలుదేరిన స్త్రీలజట్టు

# కనుచూపు మేరలో పారిశ్రామిక విప్లవం

## ప్రజలే భారం వహించాలని శ్రీ నెహ్రూ విజ్ఞప్తి

అలహాబాద్, ఏప్రిల్ 4: ...

### వికాస కేంద్రాలు

### వినాదాలు వ్యర్థం అని రష్యన్లు గుర్తిస్తున్నారు

### ఆసియా వాణిజ్య మండలి సమావేశం

### శంకుస్థాపనోత్సవాలేకాని కట్టడాలు కనపడవు

### విదేశీ పెట్టుబడులపై హెచ్చరిక

## వంశధార ప్రాజెక్టు స్థలం

### గొట్టవద్ద రిజర్వాయర్ నిర్మించాలని విజ్ఞప్తి

## బర్మాలో విధ్వంస విప్లవం

### బ్రిటన్ డాలర్ నిలవలు పెరుగుదల

### మదనపల్లిలో మశూచి

# గోవా వలస పాలన అంతరించకతప్పదు

## అమెరికా కార్మిక నాయకుని విశ్వాసం

## బిలాయ్ ఉక్కు ప్రాజెక్టు

### 17 గురు విదేశీ ఇంజనీర్ల నియామకం

### కార్మికులకు "పంచశీల"

### దివిశాలాంకా రాజకీయ మహాసభలు

# ఇంతవరకు పంచశీల: ఇంక దశశీల

## భారతదేశంతో మైత్రి వృద్ధి అవునని ఇండొనేసియా ప్రధాని భావం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 4: ...

# "రైతుల క్షేమాన్ని చూడక వ్యవసాయాన్ని నాశనంచేశాడు"

## స్టాలిన్‌పై చైనా కమ్యూనిస్టు నాయకుల ఆరోపణలు

హాంకాంగ్, ఏప్రిల్ 5: ...

# హిరాకుడ్ ప్రాంతంలో అల్యూమినియం ఫ్యాక్టరీ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 5: హిరాకుడ్ ...

## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ ఫాల్గుణ బ॥ ఏకాదశి 1956- సం॥ ఏప్రిల్ 7 శనివారం
శు॥ ఏకాదశి 8-45 ధ ని 9-55 వర్జ్యం 17-31 ల 19-13 వ
బ॥ ద్వాదశి ఏప్రిల్ 8 ఆదివారం బ॥ ద్వాదశి 9 29 శ త 11-15 వర్జ్యం 17-50 ల 19-29 వ

ఆంధ్రపత్రిక

ఒరు లేయని యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ ఫాల్గుణ బ॥ ఏకాదశి శనివారం

## బుడమేరు

ప్రజల శ్రేయోభివృద్ధికి తోడ్పడే ప్రాజెక్టుల నిర్మాణం విషయంలో ప్రాంతీయ దురభిమానాలను పాటించడంగాని, వాటిని రేకెత్తించడంగాని భావ్యం కాదు; రాష్ట్రీయ, దేశీయ దృష్టితో, సమగ్రాభ్యుదయాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని వ్యవహరించవలసిన ప్రముఖులే ఈ ధోరణిలో ప్రవర్తిస్తే, అది ఏమాత్రం తంతవ్య మనిపించుకోదు.

బుడమేరు రిజర్వాయర్ వ్యవహారం ప్రస్తుతం ఈ ధోరణిలోనే పరిణమించడం శాస్త్రవంగా శోచనీయమే. ప్రతిసంవత్సరం దాదాపు 2 లక్షల ఎకరాల పంటను తన పొట్టన పెట్టుకుంటున్న బుడమేటివరదను ఏవిధంగానైనా నిరోధించాలని కష్టపడుతున్న రైతులు అనేక సంవత్సరాలనుంచీ ఆందోళన చేస్తున్నారు; సమష్టి రాష్ట్రప్రభుత్వానికేగాక, ఆంధ్రప్రభుత్వానికికూడా విజ్ఞప్తి మీద విజ్ఞప్తిని సమర్పించారు. ప్రభుత్వం వీటిని పాటించి, బుడమేటివరదలవల్ల ప్రతి ఏడాదీ సంభవిస్తున్న నష్టాన్ని అరికట్టాలనే అభిప్రాయంతో ఏకీభవించింది. సాంకేతికనిపుణుల అభిప్రాయాన్ని సైతం సేకరించి తదనుగుణమైన సిఫార్సులను కేంద్ర వరద నిరోధకసంఘానికి అందజేసింది వారు వాటిని ఆమోదించి ద్వితీయ ప్రణాళిక క్రింద అమలుజరగవలసిన వరద నిరోధకపథకాలలో చేర్చడంకూడా జరిగింది వరద మళ్లింపు పథకంతో పాటు రిజర్వాయర్ నిర్మాణానికి అయ్యే ఖర్చుల అంచనాలను సైతం తాను ప్రచురించిన కరపత్రంలో కేంద్ర సంఘం పొందుపరిచింది

ఇంత తతంగం జరిగిన తర్వాత, బుడమేరు వరదల నిరోధానికి కేవలం 'మళ్లింపు కాల్వ' ఒకటే చాలునని అభిప్రాయపడడం జరుగుతున్నదంటే, బాధ్యతాయుతులైన వారి భావాలు ఈ విషయంలో ఏవిధంగా మారిపోతున్నవో గ్రహించవచ్చు; అయితే ఇలా ఎందుకు మారిపోతున్నవో మాత్రం దుహోహ్యం.

ఇంతేగాక, బుడమేరు పథకం నిర్మాణానికి అనేకవ్యయం లో కొంత భాగాన్ని ఎకరానికి రెండు వందల రూపాయల చొప్పున ఇచ్చి భరించడానికి కూడా ప్రతి ఏటా వరదలకు గురి అవుతున్న రైతులు సిద్ధపడ్డారు. అయితే ఈ వాదం నెగ్గదలవల్ల మాకు నష్టం లేనందున మాకు లేదని చెప్పకుంటున్నట్లు ప్రముఖులు ప్రచారం చేస్తున్నారు.

ముఖ్యమంత్రి కృష్ణాజిల్లా పర్యటన సందర్భంలో గుడివాడ, కైకలూరు, గన్నవరం, విజయవాడ తాలూకాల రైతుల తరఫున కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం, జిల్లా కిసాన్ సమ్మేళనం, రాష్ట్ర కిసాన్ సంఘం బుడమేరు రిజర్వాయర్ ఆవశ్యకతపై నివేదికలు సమర్పించారంటే, అసలు అవసరమే లేదంటున్నారనే ప్రచారం ఎంత అసత్యమై వుంటుందో ఊహించవచ్చు

వరద నిరోధక పథకాలవల్ల ప్రత్యక్ష ఫలితాలకంటే పరోక్ష ఫలితాలు ఎక్కువగా వుంటవి అదనపుభూమి సాగుకు వచ్చినా రాకపోయినా సేద్యం చేస్తున్న భూమిలో పండే పంటను రైతులు సక్రమంగా ఇల్లుచేర్చుకోడానికి వీలవుతుంది అందువల్లనే కేంద్ర ప్రభుత్వం వరద నిరోధక పథకాలకుఅయ్యే ఖర్చును కూడా అంత ప్రధానంగా పాటించడం లేదు బుడమేరు పథకం అలాంటిది కాదు; పరోక్ష ఫలితాలతో పాటు, కొత్త సేద్యం ద్వారా ప్రత్యక్ష ఫలితాలను కూడా సమకూర్చే ప్రాజెక్టు. దీనివ్యవహారం దేవుడు ఇష్టపడినా పూజారి వరమివ్వనట్లుగా పరిణమించడం దురదృష్టకరమైన విషయం

రాష్ట్ర మంత్రివర్గం ఈ వ్యవహారాన్ని పునఃపరిశీలన చేయడానికి నేడు సమావేశమవుతున్నది ఈ పునఃపరిశీలనలో వ్యక్తిగత దురభిమానాలకు ఏమాత్రం తావు ఇవ్వకూడదు. రైతులకు సంపూర్ణ ప్రయోజనం చేకూర్చే మార్గమేమిటన్నదే ప్రధాన లక్ష్యం కావాలి. తదనుగుణంగా ప్రభుత్వం తన ధోరణి మార్చుకోవాలి. 11-వ తేదీన జరిగే శంకుస్థాపనోత్సవం బుడమేరు సమగ్రపథకం అమలుకోసమే జరిగేట్లు చూడాలి బుడమేరు వ్యవహారం కృష్ణా — పెన్నా ప్రాజెక్టుకు జరిగిన రభసలాగా తయారుకాకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వానిదే

## పాక్ ఆక్రమిత కాశ్మీర్

### బలప్రయోగం ఉండదు

### నెహ్రూ ప్రకటన: ప్రధానుల సమావేశం జరగదు

అలహాబాద్, ఏప్రిల్ 6 పాక్ ఆక్రమిత "ఆజాద్ కాశ్మీర్" ప్రాంతంకోసం బలప్రయోగం చేసేఉద్దేశం భారతదేశానికి లేదని ప్రధాని శ్రీ నెహ్రూ పత్రికా సమావేశంలో ప్రశ్నలకు జవాబిచ్చారు

తమకు తెలిసినంతవరకూ ఉభయ ప్రధానుల సమావేశం ఇంతలో జరిగే సూచనలు కొనరావడం లేదని కూడా శ్రీ నెహ్రూ అన్నారు

ఆజాద్ కాశ్మీర్ ప్రజలను విడిపించడానికి భారతప్రభుత్వం చర్యలేమైనా తీసుకోదల్చిందా అనిప్రతికావిలేఖరులు ప్రశ్నించారు శ్రీ నెహ్రూ, ఇలా సమాధానమిచ్చారు.

"యుద్ధవిరామ సరిహద్దుకి రెండు ప్రక్కలా సైన్యాలున్నాయని మర్చిపోకూడదు ప్రజలు ఇటునుంచి అటుకాని అటునుంచి ఇటుకాని రాకపోకలు సాగించడం సైన్యాలు సమ్మతించవు ఆ విధంగా చూస్తే అనేకమంది జనం అటునుంచి మన ప్రాంతంలోకి మనమే రానివ్వం అయినా వందలకొద్దీ రానేవచ్చారు కాని అన్నిరకాల మనుష్యుల్నీ రానివ్వలేం.

"పాక్ ఆక్రమిత ప్రాంతంకోసం బలప్రయోగం చేసే ఉద్దేశం మనకి లేదు"

### సరిహద్దులో సైన్యాలు

సరిహద్దులో పాకిస్తాన్ సైన్యాన్ని అంతటినీ కేంద్రీకరించిన మాట నిజమేనా అని ప్రశ్నించారు ఆ వార్తలు నిజమో కాదో తమకు తెలియదని శ్రీ నెహ్రూ జవాబిచ్చారు అయితే, పాక్ సైన్యాల్లో చాలభాగం సామాన్యంగా ఎప్పుడూ సరిహద్దులోనే ఉంటున్నాయని చెప్పారు ముఖ్యంగా, పంజాబు సరిహద్దులో ఉంటున్నాయన్నారు

మరొ ప్రశ్నకు జవాబుగా భారత ప్రభుత్వం సరిహద్దుల రక్షణకు తగిన జాగ్రత్త తీసుకుందని చెప్పారు.

ఇంకో ప్రశ్నకు జవాబిస్తూ, పాక్ భారతప్రధానుల సమావేశం ఇంతలో జరిగే సూచనలు—తమకు తెలిసినంతవరకూ—కనబడ్డం లేదన్నారు

### కాశ్మీరులో స్వపరిపాలన

కాశ్మీరు సందర్భంలో శ్రీ నెహ్రూ ఈ క్రింది అంశాలుకూడా వివరించారు

కాశ్మీరులో మిగతా ఏ రాష్ట్రంలోను లేని స్వపరిపాలనాధికారం అమలులో ఉంది ఆ అధికారం వారి శిక్షణానికి భారత ప్రభుత్వం హృదయపూర్వకంగా సమర్థించింది కాశ్మీరు వాసులు వారి భవిష్యత్తును వారే తీర్చి దిద్దుకుంటున్నారు భారతప్రభుత్వంవారి కృషిలో ఎంతమాత్రం జోక్యం చేసుకోడంలేదు సహాయం మాత్రం చేస్తోంది.

కాశ్మీరు సమస్య పరిష్కారానికి ఏ పద్ధతిని అనుసరించినా, అది కాశ్మీరు ప్రజల స్థిమిత జీవనానికిగాని, భారత పాకిస్తానల వ్యవస్థలకుగాని భంగం కలిగించకూడదు అది ప్రధానం పాకిస్తాన్ పరిపాలకులు ఈ విషయాన్ని ఆవేశాలు మాని ఆలోచించినట్లయితే భారత ప్రభుత్వ విధానంలో సబబు కనపడుతుందన్నారు

కాశ్మీరు సమస్యపై భారతప్రభుత్వ వైఖరి శాంతికి ప్రమాదకరంగా పరిణమించిందని పాక్ అధ్యక్షుడు చేసిన ప్రకటనపై వ్యాఖ్యానిస్తూ, శ్రీ నెహ్రూ, తమ విధానంవల్ల శాంతి భంగపడదనీ, ప్రస్తుత పరిస్థితుల్ని భంగపరిస్తే శాంతికి భంగం ఏర్పడుతుందనీ చెప్పారు

### ఎన్నికలు అనుకున్న ప్రకారం జరుగుతాయి

వచ్చే సంవత్సరారంభంలో ఎన్నికలు అనుకున్న ప్రకారం జరుగుతాయని శ్రీ నెహ్రూ తెలియ చేశారు. ఒక మాసం ఆలస్యం అయితే కావచ్చునేమో అన్నారు. అంటే ఫిబ్రవరిలో బదులు మార్చిలో జరగవచ్చు.

కొత్త రాష్ట్రాలు కూడా అనుకున్న ప్రకారం అక్టోబరు 2 వ తేదీకి ఏర్పడతాయని ఒక ప్రశ్నకు సమాధానంగా శ్రీ నెహ్రూ చెప్పారు.

### అందరికీ అర్థం అయ్యే భాష వాడాలి

పత్రికలూ, అధికారులూ సులభంగా అందరికీ అర్థం అయ్యేభాష వాడాలని శ్రీ నెహ్రూ విజ్ఞప్తి చేశారు.

శ్రీ నెహ్రూ తమ నాకర్లు హిందీ పత్రికలు చదువుతున్నారని చెప్పారు. అయితే ఆ పత్రికల్లో హిందీ బోధపడదని వారంటున్నారు.

బెంగాలీ, మరాఠీ, గుజరాతీభాషల్లో సాహిత్యం అందరికీసుబోధకంగా ఉంటోందన్నారు. సామాన్య ప్రజలభాషకీ సాహిత్యంలో భాషకీ నిజానికి వ్యత్యాసం ఉండకూడదన్నారు. కాని హిందీలోమాత్రం చాలాతేడా ఉంటోంది. దీనికి ఉర్దూపట్ల ద్వేషం కారణం అన్నారు. ఉర్దూపట్ల విరోధభావం...

## పశ్చిమ పాకిస్తాన్ మంత్రివర్గ విస్తరణ

### ఖాన్‌సాహెబ్ ఆలోచన

లాహోర్, ఏప్రిల్ 6: త్వరలోనే తన మంత్రి వర్గంలో మార్పులు చేసి విస్తరిస్తానని పశ్చిమ పాకిస్తాన్ ముఖ్యమంత్రి డాక్టర్ ఖాన్‌సాహెబ్ నిన్నరాత్రి ప్రకటించారు మాండోట్ నవాబు ప్రభృతులు కొందరితో ఆయన సమాలోచన జరిపారు

లీగ్ సభ్యుడు కాని వారు ముఖ్యమంత్రిగా ఉండ వీలులేదని శాసనసభ ముస్లింలీగ్ పార్టీ తీర్మానించిన ఫలితంగా ఈ విస్తరణ ప్రయత్నాలు జరుగుతున్నవి

## షెడ్యూల్డ్ తరగతుల జాబితా సవరణ

### లోక్‌సభలో ప్రభుత్వబిల్లు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతుల జాబితాలో కొన్ని సవరణలు చేస్తూ హోంశాఖమంత్రి పండితపంత్ నేడు లోక్‌సభలో ఒక బిల్లును ప్రతిపాదించారు. ఈ బిల్లు జాబితాలో కొన్ని తరగతుల పేర్లను తొలగించి, కొన్ని కొత్త పేర్లను చేరుస్తున్నది.

ఈ సవరణలు రాష్ట్రప్రభుత్వాలతోనూ, షెడ్యూల్డు జాతుల సంక్షేమ శాఖాధికారులతోను సంప్రదించిన మీదటే చేసినట్లు హోంశాఖమంత్రి అన్నారు. ఈ సవరణలవల్ల షెడ్యూల్డు తరగతుల జనాభాలో వచ్చే మార్పులను లెక్కించి, వివిధ శాసనసభల్లోను వారి ప్రాతినిధ్యాన్ని సవరించే అధికారం ఎన్నికల కమిషనుకు ఈ బిల్లువల్ల లభిస్తుంది.

మద్రాసు, ఏప్రిల్ 6: డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ సేవను ప్రశంసించడానికి రేపు సాయంకాలం గవర్నరు శ్రీ శ్రీప్రకాశ అధ్యక్షతన, రాజాజీ హాలులో సభ ఏర్పాటు చేయబడింది.

## మాచర్లాపురంలో ధరల అతి

### పంటలకు నీటిక్షామం కూడాను

మాచర్లాపురం, ఏప్రిల్ 4 ఈ ప్రాంతంలో రెండు మూడు నెలలుగా, ఆహారధాన్యాల ధరలు విపరీతంగా పెరిగిపోతున్నవి పూర్వం రూ 18 అమ్మిన వడ్లబస్తా యిప్పుడు రూ 28 అమ్ముతున్నది రాగులు, కొర్రలు, జొన్నలువగైరా మెట్టధాన్యాల ధరలు బస్తా రూ 6 నుంచి రూ 10 వరకూ పెరిగినవి అపరాలు, చింతపండు, మిర్చి ధరలుకూడా ఎక్కడా అందుబాటులో లేవు

అసలే కరవుప్రాంతం అన్నింటికీ ఆకాశాన్నంటే ధరలు పేదవారిస్థితి, గుర్భరంగా నున్నది దీనికితోడు ఐదు మాసాలనుంచి వర్షపు చినుకులేదు. ఈ ఈ ప్రాంతంలో చెరువులన్నీ ఎండిపోయినవి ఈ పట్నం చెరువుక్రింద సాగయ్యే 2 వేల ఎకరాల భూమికి జలాభావం యేర్పడింది చెరువు వరవకాలవ క్రింద సాగుకు మూడురోజులు, చెరువు క్రింద సాగుకు 4 రోజులు నీరు వంతుల ప్రకారం అందిస్తున్నారు

నీరు చాలడంలేదని రైతులు ఆందోళన చేస్తున్నారు గుండ్లకమ్మనది, యీ సమీపంలో ఉన్నప్పటికీ, నీరు అక్కడినుంచి చెరవుకు ఎక్కడం దుర్లభంగా ఉన్నది

### ప్రభుత్వం గమనిస్తున్నది

కర్నూలు, ఏప్రిల్ 6 ఆహార ధాన్యాల ధరల పెరుగుదలను ప్రభుత్వం గమనిస్తోందనీ, ఆ విషయమై భారత ప్రభుత్వంతో ఆలోచించి అవసరమైన చర్యతీసుకోగలదనీ, శాసనసభలో ముఖ్యమంత్రి శ్రీ బి గోపాలరెడ్డి ప్రకటించారు

కేంద్రప్రభుత్వం హైదరాబాదులో కొంత నిలవధాన్యాన్ని విడుదలచేసినదనీ ధరలు పెరగకుండా చేయటానికి భారతప్రభుత్వంతో సంప్రదించి అవసరమైన చర్యలను తీసుకోగలమనీ ముఖ్యమంత్రి చెప్పారు

వేరుశనగ, చింతపండు ధరలు తగ్గిన సంగతిని ప్రస్తావిస్తూ వాటిధరలు నిలకడగాఉండేటట్లు చేయటానికి ప్రభుత్వం చర్యతీసుకుంటారా అని శ్రీ పి రాజగోపాలనాయుడు ప్రశ్నించారు.

ఆ సంగతికూడా ప్రభుత్వం ఆలోచించనలదని ముఖ్యమంత్రి అన్నారు

ఉన్నంతవరకూ హిందీ వృద్ధికాదన్నారు

### పరిణామ శీలమైన సహజీవనం"

పంచశీలలో ఒక సిద్ధాంతాన్ని కొద్దిగా మార్పు చేయాలని శ్రీ నెహ్రూ అన్నారు సహజీవనమాటకాని ముందు "పరిణామశీలమైన" అనేమాట చేర్చాలన్నారు

పంచశీల సిద్ధాంతాలని ప్రత్యేకంపనిగట్టుకుని ప్రకటించవక్కరలేదన్నారేకాని, ప్రపంచంలో ఏ ఒక్కదేశమూ ఆ సిద్ధాంతాలను నిరాకరించలేదన్నారు.

### పరిశ్రమ చెయ్యనివారు దేశానికి భారం

పరిశ్రమ చెయ్యడానికి జంకే వారు దేశానికి భారం అని శ్రీ నెహ్రూ అన్నారు

ఖాదీ, చేతిపరిశ్రమ కార్యకర్తల సమావేశంలో ఉపన్యసిస్తూ, ఖాదీ, గ్రామ పరిశ్రమల కార్యకర్తలు, దారిద్ర్యం, నిరుద్యోగాలపై కత్తి కట్టి పోరాడాలన్నారు

### బాలబాలికలే దేశానికి సిరి

పరేలాలో గ్రామ పంచాయతీ సమ్మేళనంలో ప్రసంగిస్తూ శ్రీ నెహ్రూ దేశానికి వెండి బంగారాలు సిరికాదనీ, బాలబాలికలే సిసలైన సంపద అనీ చెప్పారు

బాలబాలికల విద్య, ఆరోగ్యాలను పోషించలేని గ్రామ పంచాయతీలు వ్యర్థం అన్నారు ప్రతి పంచాయితీ, తన గ్రామంలోని ప్రతి బాలునికీ ప్రతి బాలికకూ విద్య, ఆహారం లభింపచెయ్యడం ప్రథమ కర్తవ్యంగా పరిగణించాలన్నారు.

### దుష్ట ఆచారాలను స్త్రీలే నివారించాలి

మరొక గ్రామంలో కమలా నెహ్రూ విద్యాలయ విద్యార్థినుల సభలో ప్రసంగిస్తూ, మన సమాజంలో స్థిరపడిన సంప్రదాయాలలో దుష్టమైన వానిని స్త్రీలే నివారించడానికి కృషి చెయ్యాలని శ్రీ నెహ్రూ అన్నారు. ముఖ్యంగా కులతత్వాన్ని స్త్రీలు నాశు చెయ్యాలన్నారు.

### ముందు సూచించినది భారతదేశం

కరాచీ, ఏప్రిల్ 6: ఏ పరిస్థితులలో కాని పాకిస్తాన్ భారతదేశాలు యుద్ధానికి దిగరాదని మొదట-ఆరేళ్ల క్రిందట-సూచించినది భారత ప్రభుత్వమేనని భారతప్రధాని శ్రీ నెహ్రూ తిరిగి పాక్ ప్రధానికి గుర్తుచేశారు.

మార్చి 29 వ తేదీని శ్రీ నెహ్రూకు పాక్ ప్రధాని వ్రాసిన లేఖలో నియుద్ధ ప్రసక్తి తెచ్చారట. అయితే దానికి షరతు లేకపోలేదు. రాయబారాలు, మధ్యవర్తిత్వం, పరిష్కర్తృత్వం అని ఒకదాని వెంట ఒకటి అమలు జరపడానికి ఒప్పుకోవాలి.

## ప్రకాశంమంత్రివర్గమేమేలు

### కాంగ్రెసు మంత్రివర్గంపై ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుని దండయాత్ర

### ఉప ముఖ్యమంత్రి మౌనం

కడప, ఏప్రిల్ 8. శాసనసభలో సంఖ్యాబలం లేక, బలియమైన ప్రతిపక్షాన్ని ఎదుర్కోవలసివచ్చినా, అధికారంలో వున్న 13 నెలలోనూ, శ్రీ ప్రకాశం మంత్రివర్గం ఏదో కొంత చెప్పుకోదగిన పని సాధించింది ఇప్పుడీ మంత్రివర్గానికి, శాసనసభలో మంచిబలం ఉండి గూడా, అంత అభివృద్ధి సాధించలేకపోవడం విచారకరం" అని శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, క్రితం ఆదివారం బహిరంగ సభలో విమర్శించారు ఉప ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, ప్రదేశ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి కూడా సభలో మాట్లాడారు.

రాష్ట్ర అభ్యుదయం భూసంస్కరణలతో ముడిపడివుంది శాంతియుతంగా విప్లవం సాధించాలని,భూదానోద్యమం బలపెట్టబడ్డైంది ఈ ఉద్యమంలో ప్రతి ఒక్కరు, చురుగ్గా పాల్గొనాలి" అని శ్రీ సత్యనారాయణరాజు విజ్ఞప్తి చేశారు

శ్రీ బ్రహ్మానందరెడ్డి మాటాడుతూ, శాసనసభలో మెజారిటీ ఉండడంవల్ల కాంగ్రెసుపార్టీకి ఉదాసీనత బలసిందని, అదే అభివృద్ధికి అడ్డంకుగా తయారైందని విమర్శించారు విశాలాంధ్ర యేర్పడడంలో 'మన బాధ్యతలుగూడా పెరిగాయి అన్యోన్యం సహకరించి రాష్ట్రాభ్యుదయానికి గట్టి కృషి చేయాలి' అని ఆయన హెచ్చరించారు

ఉపముఖ్యమంత్రి శ్రీ ఎన్ సంజీవరెడ్డి, తమ ప్రసంగంలో భూదాన యజ్ఞ ప్రాముఖ్యాన్ని వివరించారు

కడపజిల్లా కాంగ్రెసు అధ్యక్షుని వందనాలతో సభ ముగిసింది

## నరసరావుపేట పురపాలక పన్నులు

### తగ్గింపు ఉద్యమంలో ప్రదేశకాంగ్రెసు కార్యదర్శి

నర్సారావుపేట, ఏప్రిల్ 4 క్రిందటి ఆదివారం శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో పురపాలక సంఘం నిశిత విమర్శలకు గురియైంది శ్రీయుతులు కపలవాయి కాశీరామారావు, మహమ్మద్ మొహిదీన్, యిర్రి వెంకటాద్రి, నంద్యాల కోటిరెడ్డి ప్రభృతులు 56-57 సంవత్సరంలో అమలు చేయాలని విధించిన పన్నులు విపరీతంగా ఉన్నవని యీ విషయమై తమ సహాయం చేయాలని శ్రీ బ్రహ్మానందరెడ్డికి విజ్ఞప్తి చేశారు ప్రస్తుతపు పురపాలక సంఘ ఆదాయం సంవత్సరానికి సుమారు రూ 1,82,000 కొత్త పన్నుల ప్రకారం అది సంవత్సరానికి రూ 2,82,000 లకు పెరుగుతుంది శ్రీ బ్రహ్మానందరెడ్డి పన్నుల తగ్గింపు విషయమై తమ శక్తి కొలది సహాయ పడతానని వాగ్దానం చేశారు మళ్లీ మొన్న 1 వ తేదీన శ్రీ అని సెట్టి కోటిలింగం (పురపాలక సంఘ సభ్యుడు) అధ్యక్షతన జరిగిన సభలో శ్రీయుతులు యిర్రి వెంకటాద్రి, మహమ్మద్ మొహిదీన్‌సాహెబ్ పన్నుల విషయమై ప్రభుత్వమువారి వద్దకు రాయబారం వెళ్లాలని విజ్ఞప్తి చేశారు పురపాలక సంఘ ఉన్నతోద్యోగులే పన్నులు హెచ్చించడానికి చాలవరకు బాధ్యులని వారి చర్యలను విమర్శించారు

## బొంబాయి రాష్ట్ర ఉప ఎన్నికలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 4 బొంబాయి శాసనసభకు జరిగే ఉప ఎన్నికలలో పోటీ పెట్టకుండా ఉండటానికి కేంద్ర కాంగ్రెస్ పార్లమెంటరీబోర్డు నిర్ణయించింది.

బొంబాయి నగరాన్ని మహారాష్ట్రలో చేర్చనందుకు నిరసనగా కొందరు కాంగ్రెస్ సభ్యులు, ప్రతిపక్ష సభ్యులు తమ సభ్యత్వాలకు రాజీనామా చేయటంతో యీ ఖాళీలు ఏర్పడ్డాయి.

బొంబాయి నగరంలోని వివిధ తరగతుల జనాభామధ్య ఉద్రేకాన్ని నివారించటానికి యీ నిర్ణయం జరిగిందని కాంగ్రెస్ వర్గాలు తెలియ జేస్తున్నారు.

## గోవాకు పింఛన్ల బట్వాడాలో చిక్కులు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: పోర్చుగీసు ప్రభుత్వం అనుమతించనందున గోవా ప్రభుత్వ పింఛను దార్లకు పింఛన్లు యివ్వలేకపోతున్నామని భారత విదేశాంగశాఖ తెలిపింది. గోవాపట్టణమువెళ్లి పింఛన్లు బట్వాడా చేయడానికి ఒక భారతీయోద్యోగికి అనుమతి యివ్వవలసిందిగా భారత ప్రభుత్వం కోరినా, యింతవరకు 8 నెలలయినా కూడా సమాధానమే రాలేదని చెప్పకున్నారు. పింఛన్ సిబ్బంది కార్యాలయంలోనే వుండిపోయారనీ, వీరికి పింఛన్లు మంజూరు చేయ లేమని వివరించారు.

## బళ్లారి తాలూకా భవిష్యత్తు

### ఎన్నిక ద్వారా తేల్చాలని విజ్ఞప్తి

బళ్లారి, ఏప్రిల్ 4 మొన్న ఆదివారంనాడు 'సాంబమూర్తి మైదానం'లో, శ్రీ ప్రతాపగిరి వెంకట సుబ్బారావు అధ్యక్షతన జరిగిన పౌరసభలో, బళ్ళారి సమస్యపై, శ్రీ ముండ్లూరి గంగప్ప, మైసూరు శాసనసభ సభ్యత్వానికి రాజీనామా యిచ్చినందుకు అభినందిస్తూ తీర్మానించారు.

బళ్ళారి తాలూకా నియోజకవర్గంలో, యీ సమస్యపై ఎన్నిక జరిపి, బళ్లారి తాలూకా భవిష్యత్తును నిర్ణయించాలని భారత ప్రభుత్వాన్ని, మైసూరు ప్రభుత్వాన్ని కోరుతూ యింకో తీర్మానంచేశారు

## కడప పురపాలకసంఘ తీర్మానం

కడప, ఏప్రిల్ 6 ఫజులాలీ సంఘం బళ్లారి జిల్లాలోని మూడు తాలూకాలను, ఆంధ్రలో కలపాలని, ఏకగ్రీవంగా సిఫార్సు చేసినప్పటికీ, ఆ సిఫార్సులు కేంద్రప్రభుత్వం అంగీకరించకపోవడం విచారకరం కేంద్రప్రభుత్వం నిర్ణయం, లోగడ జనవరి 16 న శ్రీ నెహ్రూ విశదపరచిన ప్రభుత్వవిధాన ప్రకటనకు విరుద్ధం కాబట్టి, కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు యీ విషయాన్ని—రాష్ట్రాల బిల్లుపై పార్లమెంటు తుదినిర్ణయం చేసేలోపుగా—నిష్పాక్షికంగా విచారించి, న్యాయం కలుగజేయాలి" అని యీ పురపాలక సంఘం క్రిందటి శనివారంనాడు జరిగిన సమావేశంలో ఏకగ్రీవంగా తీర్మానించారు. సమావేశానికి, పురపాలక సంఘాధ్యక్షుడు మహమ్మద్ రహీంతుల్లా అధ్యక్షత వహించారు.

## ప్రధానికి శాసనసభ్యుల విజ్ఞప్తి

కర్నూలు, ఏప్రిల్ 6: బళ్ళారి భవిష్యత్తును ప్రజాభిప్రాయ సేకరణ ద్వారా తేల్చాలని ప్రధానమంత్రిని కోరుతూ 82 మంది శాసనసభ్యుల ఒక విజ్ఞప్తిపత్రం సమర్పించారు.

శ్రీ గంగప్ప రాజీనామా కారణంగా జరుగనున్న ఉపఎన్నికను ప్రజాభిప్రాయంగా పరిగణించవచ్చని సూచించారు.

## 14 అడుగుల సొరచేప

శ్రీకాకుళం, ఏప్రిల్ 6: కళింగపట్నం రేవుకు 6 మైళ్ళ దూరంలో సముద్రగర్భంలో ఒక పెద్ద సొరచేపను శ్రీకాకుళం మత్స్యశాఖవారు పట్టుకున్నారు. దీని పొడవు 14 అడుగులు, బరువు 200 సేనులు.

## హైకోర్టుకు హుందాతనం

### ఒకేచోట ఉంటేనే

గుంటూరు, ఏప్రిల్ 8 శాఖలు, ప్రాంతీయ విభాగ న్యాయస్థానాలనే వేమీ లేకుండా ఆంధ్ర – తెలంగాణా రాష్ట్రానికి ఒకే ఒక హైకోర్టును రాజధానిలో ఏర్పాటు చేయమని ప్రభుత్వాన్ని కోరుతూ ఆంధ్ర బార్ కౌన్సిల్ గత నెల 30 వ తేదీన తీర్మానించారు.

తీర్మానాన్ని సమర్థించుతూ బార్ కౌన్సిల్ అధ్యక్షుడు ఈ క్రింది ప్రకటన చేశారు "హైకోర్టు హుందాతనం పరిపాలనాసౌకర్యం, వాజ్యాలకు వచ్చే వారి మనస్తత్వం వంటి వాటిలో ఏ దృష్టితో చూచినా ఒకేఒకచోట ఒకే హైకోర్టును ఏర్పాటు చేయవలసిన అవసరం స్పష్టమవుతుంది ఉర్దూభాషమాత్రమే బాగా తెలిసిన ప్రజలు, న్యాయవాదుల ఇబ్బందుల విషయమై తెలంగాణా నాయకులు చెబుతున్న చిక్కులనుకూడా ఒకేఒక హైకోర్టును ఏర్పాటుచేసి దానికి ఒకటో రెండో అనుబంధశాఖాన్యాయస్థానవిభాగాలను యేర్పాటు చేసి పరిష్కరించవచ్చు ఇందుకని ప్రత్యేక విభాగ న్యాయస్థానాన్ని ఏర్పాటు చేయవలసిన అవసరం ఏమాత్రమూ లేదు హైకోర్టుకు అనుబంధశాఖను గుంటూరులో ప్రత్యేక న్యాయస్థానాన్ని ఏర్పాటుచేస్తే చాల చిక్కులు వస్తవి అనేకం పన్నుల అప్పీళ్ళ పరిష్కార న్యాయస్థానం, కేంద్ర రెవెన్యూమండలివంటి కార్యాలయాలన్నింటిని రాజధానికి తరలించక తప్పదు వీటన్నింటిని రాజధానికి తరలించి గుంటూరులో హైకోర్టు విభాగన్యాయస్థానాన్ని ఏర్పాటు చేస్తే న్యాయవాదులకు చాలాఇబ్బంది విచార పరిష్కార న్యాయస్థానాలకు వారు హాజరయ్యే అవకాశం ఉండదు ఈ విషయాలన్నీ ఇట్లా ఉన్నాకూడా ఎవరిధ్యేయాలకో నివారించడానికి కాని లేక మరెవరి మనస్సో నొచ్చుకుంటుందనిగాని రెండు విభాగాలను ఏర్పాటు చేయడ మవసరమైతే ఆ గుంటూరులో ఇప్పుడున్న ఆంధ్ర హైకోర్టును హైదరాబాద్‌కు తరలించడం ఒకటే సరయినమార్గం ఇటువంటి ఏర్పాటువల్ల ఒకేఒక ప్రధాన న్యాయమూర్తి రెండు విభాగాల పరిపాలనా నిర్వహణ వ్యవహారాన్ని చూచుకునే వీలుంటుంది ఇప్పుడు ఆలోచనలో ఉన్న పద్ధతికంటే ప్రజల ఇబ్బందులు మేము సూచించిన పద్ధతిలో తగ్గుతవి."

"కొత్త రాష్ట్రం హైకోర్టును ఎక్కడ ఏర్పాటు చేయవలసినది నిర్ణయించే అధికారం కొత్త రాష్ట్రం గవర్నరుకు ప్రధాన న్యాయమూర్తికి కలదని బిల్లులో ఉన్నది హైదరాబాదులో ఒకటి, గుంటూరులో మరొకటి హైకోర్టుకురెండువిభాగాలనువీర్పాటు చెయ్యాలని ఒప్పందం కుదిరిందన్న ధోరణిలో శ్రీ జె వి నరసింగరావు ప్రకటించారు ఈ రెండు పరస్పర విరుద్ధంగా ఉన్నవి ఇంకొక విచిత్రం ఏమిటంటే ప్రస్తుతం ఆంధ్ర హైకోర్టు పర్యవేక్షణాధికారంలో ఉంటున్న మూడు జిల్లాలను హైదరాబాద్ హైకోర్టుకు మార్చుతారట, అంటే ఇప్పటి పరిస్థితిని యథాతథంగా ఉంచే వీలైనా లేదన్నమాట ఈ చిక్కు లన్నింటిని పరిష్కరించడానికి వీలైన పరిష్కార మార్గం కనిపెట్టాలి"

"శ్రీ నరసింగరావు ప్రకటనలోని చిక్కులను నాయకు లందరు గమనించి బిల్లులో అసలేమి ఉన్నదో పరిశీలించడం అవసరం. బిల్లులో ఉన్నట్టు ఒకే ఒక హైకోర్టును ఏర్పాటు చేయడం ఉత్తమం లేదా శ్రీ నరసింగరావు ప్రకటనలోని చిక్కులకు అవకాశమివ్వని మరొక పద్ధతిని కనిపెట్టాలి"

తీర్మానం ప్రతులను శ్రీ నెహ్రూ, మౌలానాఆజాద్, పండిత గోవిందవల్లభ్‌పంత్, శ్రీ యు ఎన్ ధేబర్, శ్రీ గోపాలరెడ్డి మొదలైనవారికి పంపించారు.

## బాండుంగ్ సభ వార్షికోత్సవం

కలకత్తా, ఏప్రిల్ 4: బాండుంగ్ సభ వార్షికోత్సవం ఈనెల 24 న జరుగుతుంది. ఆసియా, ఆఫ్రికా సంబంధాల సంస్థ దీనిని నిర్వహిస్తుంది. మూడు రోజులపాటు ఈ వార్షికోత్సవం జరుగుతుంది. ఈ వుత్సవ నిర్వహణ సంఘానికి పశ్చిమ బెంగాల్ శాసనసభాధ్యక్షులు శ్రీ శైలకుమార్ ముఖర్జీ అధ్యక్షులు. నేడు జరిగిన విలేఖరుల గోష్టిలో కార్యక్రమ వివరాలను శ్రీ ముఖర్జీ తెలిపారు. గోష్టిలో చైనా, జపాన్, నేపాల్, ఈజిప్టు, ఇండొనీషియా కాన్సలేట్ కార్యాలయాల ప్రతినిధులు పాల్గొన్నారు. బహిరంగసభలో శ్రీ కృష్ణమీనన్, శ్రీ చాందా ప్రసంగిస్తారు.

## సెంట్రల్ బ్యాంకు సిబ్బంది సంఘం

బొంబాయి, ఏప్రిల్ 4: అఖిల భారత సెంట్రల్ బ్యాంకు ఉద్యోగుల సంఘం తమ కార్యవర్గం నిర్ణయించినట్లు అఖిల భారత బ్యాంకు ఉద్యోగుల సంఘంతో తెగతెంపులు చేసుకోటానికి తీర్మానించింది.

తరవాత 63 మంది ప్రతినిధులు సమావేశమై, దేశస్థాయిలో ఒక బలమైన బ్యాంకు ఉద్యోగుల సమాఖ్యను ఏర్పాటు చేయటానికి నిశ్చయించారు.

## సంపాదకునకు లేఖలు

### జీవితబీమాలో ఉద్యోగస్థులు

అర్యా, జూలై 1 నుంచీ దేశమంతటికీ ఒకే జీవితబీమా కార్పొరేషను ఉంటుంది చట్టముగా మారకముందు అనగా పరిశీలక సంఘపు సనిపూర్తికాక పూర్వము కొన్నిమార్పులుగాని లేక భద్రతలుగాని ఏర్పాటుచేయవలసిన అవసరంఉంది

జీవితబీమా కంపెనీలలో ఉద్యోగస్థులుగా ఉన్నవారు ఏ కొలదిమందో ఆయా కంపెనీల యితరశాఖలలో ప్రస్తుతం పనిచేస్తున్నారు ముఖ్యముగా ఏజెంటు, ఇన్‌స్పెక్టర్లు, ఆర్గనైజర్లు మొదలైనవారు అన్నిశాఖలకు వ్యాపారం చేస్తూ ఉన్నారు. అట్టివారిలో జీవితబీమా వ్యాపారం ప్రచారంచేయడంలో అరితేరినవారు కలరు కాని అర్హతలున్నవచ్చే సమయంలో యీ శాఖలో ఉద్యోగస్తులు గారేరు. అట్టివారికికూడా యీరకపోయే ప్రభుత్వపుబీమా కార్పొరేషనులో చేరగలందులకు ప్రభుత్వం అవకాశం యివ్వవలసిఉంటుంది లేనియెడల వారికి చాలా యిబ్బంది కలుగగలదు. ఇంతవరకు వారు సంపాదించిన అనుభవము ప్రజ్ఞ, అత్యవసరంగా భావించి అనుభవజ్ఞులైన వారినికూడా ప్రభుత్వము తీసుకోవలసినదిగా కోరుచున్నాను. అట్లా చేయడానికి అవసరమైన రక్షణలు చట్టములోనే చేర్చవలసిందిగా కోరుతున్నాను అనేకసంవత్సరములుగా జీవితబీమా వ్యాపారాభివృద్ధికి తోడ్పడి ప్రస్తుతం యితరశాఖలలో ఉండుటవలన యీ సదవకాశమును పొందలేక యిబ్బందిపడు వ్యక్తులుచాలామందిఉన్నారు జీవితబీమా వ్యవస్థలో ప్రస్తుతం ఉన్నవారినే సభ్యులుగా చేర్చుకోవడం అసమంజసము భవిష్యత్తులోను వర్తమానకాలంలో పూర్వంలోనూకూడా జీవితబీమా వ్యాపారం వృద్ధిపొందించడంలో కృషిచేసిన వ్యక్తులందరిని సభ్యులుగా చేర్చుకోవాలని నా హెచ్చరిక. నా వెంకటాచలం.

* * *

### కొవ్వూరుకు విద్యుచ్ఛక్తి

ఆర్యా, కొవ్వూరుకు విద్యుచ్ఛక్తి రావడం దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడన్నట్లుంది. ప్రభుత్వంవారు గత రెండుమాసాలనుంచీ పని చురుకుగా చెయ్యడంవల్ల స్తంభాలు పాతడం, తీగెలు వెయ్యడం, ఇత్యాది కార్యకలాపాలన్నీ అయినవి. ఏలూరు విద్యుచ్ఛక్తి విజ్జేశ్వరంనుంచి వేములూరు మీదుగా కొవ్వూరుకురావాలి ఇందుకుగాను తీగెలు కొవ్వూరు రైలుస్టేషను దగ్గర రైలుపట్టాలు దాటాలి ఈ దాటడానికి రైలు అధికారులు ఒప్పుకోవాలి దీనికి వారు అడ్డంకులు పెడుతున్నారనీ, అందువల్ల గోదావరి పుష్కర ప్రారంభంలోపుగా వస్తుందనుకొన్న విద్యుచ్ఛక్తి అర్ధముకరి మూడు నెలలైనా వెనక్కి పోతుందని ప్రజలు చెప్పకుంటున్నారు ఇట్టి అడ్డంకులు ఎవరు పెడుతున్నారు? ఎందుకు పెడుతున్నారు? ఈ విషయం ఆంధ్ర విద్యుచ్ఛక్తిశాఖ మంత్రి శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య తక్షణం కనుక్కొని పుష్కరంలోపల, అంటే ఏప్రిలు నెలాఖరులోపల, కొవ్వూరుకు విద్యుచ్ఛక్తి వచ్చేటట్లు చేయాలని కోరుతున్నాను

కొవ్వూరు గోపరాజు రాజన్న.

## తిరువళ్లూరు ఓటర్లకు విజ్ఞప్తి

### గోవిందరాజులు అభ్యర్థిత్వం

మద్రాసు, ఏప్రిల్ 6 సేవాసమాజం కార్యదర్శి శ్రీ యం యస్. ప్రసాద్ ఇలా వ్రాస్తున్నారు:

తిరువళ్లూరు పార్లమెంటు స్థానానికి అఖిలభారత కాంగ్రెస్ నియమించిన చెంగల్పట్టు జిల్లాబోర్డు అధ్యక్షుడు శ్రీ ఆర్. గోవిందరాజులు నాయుడు పోటీ చేస్తున్నారు. నాయుడుగారి యోగ్యతలు, గుణగణాలు, నిరంతర ప్రజాసేవ, ఓటరులకు ఇదివరకే తెలుసును. జిల్లాబోర్డు అధ్యక్షుడుగా వీరు జిల్లాప్రజలకు చేసినసేవ అపారం. తిరువళ్లూరు పార్లమెంటు స్థానాన్ని నాయుడుగారు అలంకరించటం మన జిల్లాకేగాక రాష్ట్రమంతటికీ గౌరవం. కాన ఓటరు మహాశయులందరూ అధిక సంఖ్యాకులుగా ఏప్రిల్ 8 తేదీ ఆదివారంనాడు ఓటుచేసి నాయుడుగారిని గెలిపించి కాంగ్రెస్ సంస్థ పేరు ప్రఖ్యాతులు నిలుప వలసిందిగా కోరుతున్నాను.

## బొంబాయి మార్కెట్

బొంబాయి, ఏప్రిల్ 6:

| | |
|---|---|
| వెండి (100 తు.) | 178-6-0 |
| బంగారం తులం 1 కి | 103-13-0 |
| పత్తి | 66-14-0 |
| వేరుశెనగ విత్తులు | 81-2-0 |
| అవిశె విత్తులు | 83-0-0 |
| అవిశె నూనె | 21-2-0 |
| ఆముదం విత్తులు | 27-6-0 |
| వేరుశెనగ నూనె మణుగు | 18-10-0 |
| షుగర్ విత్తులు | 29-0-0 |

